రిజిస్టర్డ్ నెం. హెచ్.ఎస్. 15 | స్థాపితం: 1930 | 22-2-1991 | శుక్రవారం | రు. 1.50 పై

# జమీన్ రైతు



సంపుటి: 62 సంచిక 8 | స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు | మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి | సంపాదకుడు : నెల్లూరు డోలేంద్రప్రసాద్

### హన్మన్న తప్పుల చిట్టా తయారౌతూంది!

## పిసిసి పై ఫిర్యాదు!

రాష్ట్ర పిసిసి అధ్యక్షుడు శ్రీ వి. హనుమంతరావు వ్యవహరిస్తున్నతీరుపై పార్టీ అధిష్ఠానవర్గానికి ఫిర్యాదుచేయాలని రాష్ట్ర కాంగ్రెసులో ఒకవర్గం నిర్ణయించుకున్నట్లు తెలిసింది. శ్రీ హనుమంతరావు పిసిసి అధ్యక్ష బాధ్యతలు స్వీకరించిననాటినుంచి నేటివరకు ఏకపక్షంగా తీసుకన్న నిర్ణయాలు, ప్రత్యర్థి కార్యకలాపాల్లో నేరుగా జోక్యంచేసుకున్న సందర్భాలను ఉటంకిస్తూ ఒక జాబితాను రూపొందిస్తున్నట్లు తెలుస్తోంది. గాంధీభవన్‌ను పిసిసి కబేరియన్‌గా మార్చుకొని 'సర్వం నాకే' అన్నధోరణితో వ్యవహరిస్తున్న పిసిసి అధ్యక్షునికి ఇప్పటికైనా 'బ్రేక్' వేయకపోతే రాష్ట్రంలో పార్టీ ప్రతిష్ఠ దిగజారుతుందని సీనియర్ నాయకులుసైతం ఆందోళన చెందుతున్నారు. ముఖ్యంగా రాష్ట్రప్రభుత్వ వ్యవహారాలలో జోక్యం చేసుకుంటూ ఉన్నతాధికారులకు లేఖల ద్వారా, టెలిఫోన్‌ద్వారా ఆదేశాలు జారీ చేయటం ఎంతమాత్రం మంచిదికాదని పార్టీవర్గాలంటున్నాయి.

గాంధీ భవన్ నిర్వహణ తీరుతెన్నుల వల్ల కూడా పలువురు కార్యవర్గ సభ్యులు పెదవి విరుస్తున్నారు. పిసిసిలోని విరుగుడు ఉపాధ్యక్షులకు ఒకే గదిలో కుర్చీలు, బల్లలు వేసి కూర్చోపెట్టడం పిసిసి అధ్యక్షుడి నిరంకుశ ధోరణికి

### రాజధాని లేఖ

నిదర్శనమని ఉపాధ్యక్షులు బహిరంగంగా ధ్వజమెత్తారు. తమకు ప్రత్యేకంగా గదులు కేటాయించకుండా ఉద్దేశ్యపూర్వకంగానే హనుమంతరావు ఇలా చేస్తున్నారని వారంటున్నారు. వారం రోజుల్లోగా తమకు ప్రత్యేక గదులు కేటాయించక పోయినట్లయితే పిసిసి చీఫ్ తప్పుల జాబితాతో అధిష్ఠానవర్గానికి ఫిర్యాదుచేయాలని వారు నిర్ణయించుకున్నారు. తమకు జరిగిన అవమానానికి నిరసనగా గాంధీ భవన్ మెట్లుకూడా ఎక్కరాదని వారు నిర్ణయించుకున్నట్లు తెలిసింది. అయితే పిసిసి చీఫ్ తనతప్పును అంగీకరించి తమ గౌరవాన్ని కాపాడేపక్షంలో తిరిగి తాము గాంధీ భవన్లో అడుగు పెట్టగలమని వారంటున్నారు.

ఇలావుండగా సొంత పార్టీలోనేగాకుండా ప్రతిపక్షాలుసైతం హనుమంతరావు ధోరణిపై ధ్వజమెత్తుతున్నాయి. భారతీయ జనతా పార్టీ శాసనసభా నాయకుడు శ్రీ సిహెచ్. వి. విద్యాసాగరరావు పిసిసి అధ్యక్షుడి పని తీరును తీవ్రంగా దుయ్యబట్టారు. విధాన పరమైన నిర్ణయాలను తాను, ముఖ్యమంత్రి కలిసి అమలు పరచగలమని హనుమంతరావు ప్రకటించడం తీవ్ర అభ్యంతరకరమని ఆయన అన్నారు. హనుమంతరావు రాష్ట్ర పరిపాలనలో అనుచితజోక్యం చేసుకుంటున్నారని, రాజ్యాంగేతరశక్తిగా వ్యవహరిస్తున్నా

— కొరవ 12 వ పేజీలో

## నెల్లూరుపోలీసు నిస్తేజము నిర్వీర్యమైపోయింది!

నెల్లూరుటౌన్ దొంగ చక్రవర్తుల సామ్రాజ్యంగా మారిపోయింది. పోలీసు శాఖ నిర్వీర్యంగా, నిస్తేజంగా, నిస్పృహయంగా చేతులు వెల్లికలవేసి, చతికిలబడి కూర్చోవడంతో - దొంగలకు పట్టపగ్గాలు లేకుండాపోయింది. టౌన్లో చోరీజరగని రాత్రిలేదు, ప్రాంతంలేదు. రాత్రిళ్ళు నిద్రచెడగొట్టుకోవడ మెందుకనుకున్నారేమో, రిమద్ర్య పట్టపగలే దర్జాగా, మరానాగా ఇల్లు కొల్లగొట్టి పోతున్నారు. పోలీసులంటే దొంగలకు గడ్డిపోచతో సమానమైపోయింది. ప్రజలలో విశ్వాసం సన్నగిల్లింది. దొంగతనానికి గురైనవారు గుండెలుబాదుకొని, కన్నీళ్ళు పెట్టుకొని, తమఖర్మ ఇట్లాకాలిందని సరిపెట్టుకుంటున్నారు; ఇతిమూడారు తమవంతు ఎప్పుడు వస్తుందోనన్న ఆందోళనతో, అలజడితో హడలిచస్తూ, కళ్ళలో వత్తులువేసుకొని దివారాత్రులు కాపలా కాసుకుంటున్నారు.

ఈ నెలలోనే పోలీసుకు రిపోర్టయిన చోరీలసంఖ్య పాతికకు మించుతున్నది. రిపోర్టుకానివి అంతకు రెట్టింపువుంటాయి. ఫిర్యాదుచేస్తే పోయినసొత్తు వస్తుందనుగాని దేముడెరుగు-ఉండరాలకు అదనపుఖర్చు, త్రిప్పటతో ఒంట్లోని సత్తువ కరిగిపోవడంతప్ప, ఏ ప్రయోజనమూలేదన్న

> పట్టపగలు దోపిడీలు
> పెచ్చుపెరిగి పోతున్నా
> పట్టించుకునేవారు లేరు!
> ముఖ్యమంత్రిగారూ—
> మీ స్వంతజిల్లా
> దుస్థితి గమనించండి!

నిశ్చితాభిప్రాయానికి వచ్చేశారు పౌరులు.

రాత్రి పదిగంటలప్పుడు ఒక ఇంట్లో దొంగతనం జరిగిందని ఈ విలేఖరి ఇన్స్పెక్టర్ గారికి ఫోన్ చేసి చెప్తే, "మరి ఏదండి, మా స్టేషన్లో చెప్పండి. చూసుకుంటారు" అన్నారు. మంచి దేనికో ఆ ఇన్స్పెక్టర్

—కొరవ 12 వ పేజీలో

జమీన్‌రైతు

# బ్లాక్ మెయిల్?

శ్రీ చంద్రశేఖర్ ప్రభుత్వాన్ని కాంగ్రెస్‌పార్టీ ఆడిపిస్తున్న తీరు చూస్తుంటే బాధకల్గుతున్నది. చవకబారు క్రైం సినిమాలో బ్లాక్ మెయిలర్ పాత్రను పోషిస్తున్నట్లున్నది. కాంగ్రెస్‌పార్టీ ధోరణి. చంద్రశేఖర్ ఒక్కరోజుకూడా సాఫీగా ప్రభుత్వం నిర్వహించకూడదన్నట్లు, ఒక్కరాత్రి సుఖంగా నిద్రపోకూడదన్నట్లు పడియకొక సమస్య సృష్టించి, గొంతెమ్మ కోర్కెలతోరి ప్రాణం తోడేస్తున్నారు కాంగ్రెస్ నాయకులు.

మెడమీద కూర్చుని మద్రాసు ప్రభుత్వాన్ని రద్దుచేయించారు. దానిఫలితంగా ప్రజాస్వామ్య వ్యతిరేకి అన్న ప్రచారానికి గురికావడంతోపాటు, గవర్నర్లను అవమానించాడన్న నిందకూ గురికావలసి వచ్చింది. స్పీకర్ ఉత్తర్వుతో పార్లమెంట్ సభ్యత్వం కోల్పోయిన మంత్రులకు ఉద్వాసనచెప్పాలని ఆదేశించారు. అదీ జరిగిపోయింది. అమెరికా విమానాలకు భారత భూభాగంపై ఇంధనం నింపడం తగదని ప్రకటించారు. తమసలహా పెడచెవినబెడితే ప్రభుత్వానికి రాం, రాం చెప్తామని బెదిరించారు. కొంత తడబాటు, తత్తరపాటుల తర్వాత ఆ హెచ్చరికకూ తలవొగ్గవలసివచ్చింది, చంద్రశేఖర్‌కు! అమెరికా నేతలుకూడా ఆయనపరిస్థితికి జాలిపడి, మేము శ్రీలంకలో పెట్రోలు పట్టుకుంటాంలెమ్మని తమంతటతాముగా చెప్పి, పరువు కాపాడారు.

పార్లమెంట్ సమావేశం ముందు వార్షికబడ్జెట్‌పై మళ్ళీ వివాదం రేపింది కాంగ్రెస్‌పార్టీ. బడ్జెట్‌లో కొత్తపన్నులు విధిస్తే, పార్లమెంట్ సమావేశంలోపల తాము ప్రభుత్వాన్ని వ్యతిరేకించక తప్పనిపరిస్థితిఏర్పడుతుందని రాజీవ్‌గాంధీ హెచ్చరించారు ఏ ప్రభుత్వానికైనా ఇంతకంటే సంకటమైన, అవమానకరమైన పరిస్థితి ఏర్పడుతుందని వూహించలేము గల్ఫ్ యుద్ధం ఫలితంగా ఏర్పడిన క్లిష్టపరిస్థితులలో, విదేశీమారకద్రవ్యం హరించుకొనిపోయినదశలో కొత్తపన్నులు లేకుండా బడ్జెట్ ప్రవేశపెట్టడం ఏ ప్రభుత్వం తరమౌతుంది? నాలుగున్నర దశాబ్దాల కాలంలో పన్నులు వేయకుండా ప్రభుత్వాలు నడిపిన నాయకులు, పార్టీలు ఏవివున్నాయి మనకు? బడ్జెట్ లోటు పదివేలకోట్లు మించిన పరిస్థితుల్లో పన్నులు లేకుండా పాలనచేయడం చంద్రశేఖర్‌కు సాధ్యమయ్యేపనేనా? ఆ సమస్యను తప్పించుకోవడానికి ఓట్ ఆన్ అకౌంట్ బడ్జెట్ ప్రవేశపెట్టి, కొంతకాలం నెట్టామని ప్రయత్నిస్తే- ఆర్థికమంత్రి ఎదురుతిరుగుతున్నాడు. కరవమంటే కప్పకుకోపం, విడవమంటే పాముకుకోపం అన్నట్లుంది ప్రధాని పరిస్థితి.

చంద్రశేఖర్ ప్రభుత్వం ఏర్పాటు సమయంలో రాజీవ్‌గాంధీ రాష్ట్రపతికి ఇచ్చిన హామీకి, ఈ వైఖరికి పొంతన కుదరడంలేదు. ఆనాడాయన ప్రభుత్వానికి తమ మద్దతు కనీసం ఒక సంవత్సరంపాటు బేషరతుగావుంటుందని స్పష్టమైన హామీఇచ్చిన తర్వాతనే రాష్ట్రపతి, చంద్రశేఖర్‌ను పిల్చి పెత్తనం అప్పచెప్పాడు. కాని, మూడు నెలలు తిరగకముందే రాజీవ్‌గాంధీ సవాలక్షషరతులుపెట్టి కేంద్రంలో అస్థిరత్వానికి ప్రాణంపోస్తున్నాడు.

దేశశ్రేయస్సు, కాంగ్రెస్‌పార్టీ భవిష్యత్తులు రెండింటికి క్షేమదాయకం కాని వైఖరియిది. చంద్రశేఖర్ ప్రభుత్వం గద్దె ఎక్కేనాడే దాని బలహీనతలు రాజీవ్‌గాంధీకితెలుసు; ఇప్పుడు కొత్తగా ప్రధానిని ఇరకాటంలోపెట్టి, తమపనులు చేయించుకోవలసిన అవసరమేలేదు. చంద్రశేఖర్‌ను తన ఇంటికి పిలుపనంపి, తనకు కావలసినరీతిలో పనులను జరిపించుకొని వుండవచ్చు. రాజకీయంగా కాంగ్రెస్ పార్టీకి ప్రయోజనకరమైనరీతిలో ప్రభుత్వాన్ని తెరవెనుకచేరి నడిపించవచ్చు. అట్లాకాక, ప్రతి చిన్న విషయాన్నీ పత్రికలకెక్కించి, రచ్చచేసి, భయపెట్టి, బెదిరించి, ప్రజలందరికీ తెలిసేటట్లుగా చంద్రశేఖర్‌ను లొంగదీయడం వల్ల ఇటు కేంద్ర ప్రభుత్వం నవ్వులపాలౌతున్నది; అటు కాంగ్రెస్‌పార్టీపట్ల దురభిప్రాయం ఏర్పడుతున్నది. ప్రపంచంలో కూడా భారతప్రభుత్వం అపహాస్యంపాలయ్యేపరిస్థితి దాపురిస్తున్నది నూరేళ్ళచరిత్ర కల్గిన పార్టీగా కాంగ్రెసు, విజ్ఞతకల్గిన నాయకుడుగా రాజీవ్‌గాంధీ చేయదగిన పనికాదిది. తమకు నచ్చకుంటే ప్రభుత్వాన్ని కూలదోయడమో, లేకుంటే నిర్దిష్టకాలం ప్రభుత్వ నిర్వహణలో వ్రేలు పెట్టకుండా వుండడమో చేయాలి!

జమీన్‌రైతు

21-2-1941
12 పేజీలు అణా

### గెలిటీ గారికి గాంధీగారి మాట

"గెలిటీగారి వ్యాఖ్యానాలు మానసనష్టం దావాకు అస్కారంకల్గించవచ్చేవే జనప్పటికి సత్యాగ్రహులు అసలు చేయకూడదు. గెలిటీగారు మన వుద్యమమునకు చెరుపుకల్గచేయజాలరు, తమ ఉద్యోగావిశే కళంకంతెచ్చుకున్నారు" అని గూడూరు కాంగ్రెసువాది పి. నారాయణగారికి ఇచ్చిన ప్రత్యుత్తరంలో గాంధీజీ వ్రాశారు. గెలిటీగారి కేసులతీర్పుల వివరములు నారాయణగారు లేఖద్వారా గాంధీజీకి వ్రాసియుండిరి.

### కొమరిక పంచాయితి

700 పుట్లు ధాన్యం పండించే కోదండరామిరెడ్డిగారు ప్రెసిడెంటు అయ్యేకూడా అపవాదు తప్పలేదంటే దురదృష్టమనాలె కాల్వకట్టలు పల్లిక యాలు వేయమంటే పాశీకం చూపారట కెట్లస్థలాలు రెండేండ్లనాడు తెచ్చి పిడుటలో పారేస్తే ఆస్థలాలు కరణగారి కూరగాయల పందిళ్ళకు, ఇంకవిధంగా వాడుకుంటున్నవేగాని వాటికివాటికి మోక్షంలేదు కిస్తీ. నీవంటి వాడుగూడా ఇలాచేసే అంధ్రిమాట నెతిన కొంగేసుకొని ఏడ్వదటయ్యా.

### నెల్లూరు ముచ్చట్లు

మున్సిపాలిటీ రివిజనులో పన్నులు విపరీతంగా

### 50 ఏళ్ల క్రితం ఈ వారం

పెంచారని కమీషనర్ను దూర్పారబడుతున్నారు ప్రజలు. రెడ్డిగారూ! మూన్నాళ్ళ ముచ్చటకు అలాపావుల రెందుకవులావు. అదేమిటో విచారించి న్యాయంచేయండి!

మరోమాట మున్సిపాలిటీ మురికి నీళ్ళు తెచ్చి బృందావనంలో కాల్వ గట్టున గుమ్మరిస్తున్నందున అదుర్గంధానికి చుట్టుప్రక్కలవారు నిల్వలేకున్నామంటున్నారు. అసలే ద్రయినేజీలేక మురికికూపం అనుభవించే ఆ బృందావనానికే ఈ దౌర్గత్యంగూడా ఎందుకు? మరెక్కడన్నా దూరంగా వేయు దగాదా?

### పెట్టు క్రిష్టారావు

నెల్లూరుటౌను పోలు ఇన్స్‌పెక్టరు క్రిష్టారావుగారు పిట్లరు అన్నమొగుడుగా సంచరిస్తున్నారు. ఎక్కడ చూచినా అయన్నూగార్చిన కంప్లెయింట్లే వినబడుతున్నవి. ఈ మధ్య కలరా తగిలిందని ద్రాక్షపూట వీధివద్ద కెళితే తెల్లవారిపూస్తాంపొమ్మన్నారట. అరోగిని తెల్లవారి హాస్పిటలుకు నేరిస్తే అంతస్యమైదన్నారట హాస్పిటలువాండ్లు పాపం ఆరోగి చర్యాదు కనుప గుండెకాయగలం పట్టాభి! వీరి మీద ఏంచర్యతీసుకున్నావ్?

### అరెస్టు

అల్లూడువద్ద సింగపేటగ్రామంలో శ్రీ అవ్వకాయల విశ్వనాధం, అమరా లక్ష్మీశివయ్య, పెం నాగేశ్వరరావు గార్లు తే 10 ది మధ్యాహ్నం అరెస్టు చేయబడిరి. అల్లూడలో సత్యాగహులకు వలయు సౌకర్యములు సిఎయమై శ్రీ బీ శేషయ్య, మా. రమణారెడ్డి మా. ఆదిశేషారెడ్డిగార్లు శ్రద్ధగా చూచిరి.

మిగతా సత్యాగ్రహులందరూ తోటపల్లిగూడూరులో అరెస్టు చేయబడిరి. వీరందరిని 10 రోజులు సబ్‌జైలుకు రిమాండ్‌జేశారని తెలుస్తున్నది.

# వార్డన్లను తప్పుచేస్తే అడగడం తప్పా?

రాష్ట్రంలోని సాంఘిక సంక్షేమ హాస్టళ్ళను తనిఖీచేసి, తప్పుచేస్తున్న వార్డన్లను సస్పెండ్‌చేసిన మంత్రి శ్రీ చిత్తరంజన్‌దాస్‌పై రాష్ట్రవార్డన్ల సంఘం ధ్వజమెత్తడం గర్హనీయం. సంఘముఉన్నంతమాత్రాన తమ ఇష్టంవచ్చినట్లు నోరు పారేసుకోవడం క్షమార్హంకాదు

వార్డన్లు మంత్రిపై మాటలదాడి చేసేముందు, తమ తప్పులు తెలుసుకోవడం ధర్మం. తమ ఆధ్వర్యంలో నడిచే హాస్టళ్ళలో పసిబిడ్డలకు సక్రమంగా అన్నం పెడుతున్నారా? ఆ అన్నంలో రాళ్ళు, పురుగులు రాకుండా చూస్తున్నారా? పిల్లలకు పీరు అన్నంగిన్నెలలోపెడుతున్నారా లేక లోటాంలో తినమంటున్నారా? ప్రభుత్వం పసిపిల్లల సంక్షేమంకోసం వెచ్చించే కోట్లాదిరూపాయల ధనం సద్వినియోగమయ్యేందుకు వీరు సహకరిస్తున్నారా?

హాస్టళ్ళు ఎంత అధ్వాన్నంగా వుండేది, వార్డన్లు ఎంత బాధ్యతారహితంగా వ్యవహరించేది ప్రజలందరికీ తెలుసు. వీరి అలసత్వంవల్ల పసిబిడ్డలు ఆకలితో అలమటించడం, విద్యావిహీనులుగా జీవితాలు నాశనం చేసుకోవడం ప్రజలకు తెలుసు. ఇటువంటి పరిస్థితిలో మంత్రులు, అధికారులు హాస్టళ్ళు తనిఖీ చేయడం తప్పా? వార్డన్లుచేసే తప్పులకు శిక్ష వేయకూడదా? సంఘం వున్నంతమాత్రాన తమ ఇష్టారాజ్యంగా చెలామణీ కావాలనుకుంటున్నారా?

వార్డన్ల సంఘం అవలంబిస్తున్న ఈ విచిత్రవైఖరిని ప్రభుత్వమేకాదు - పేద పిల్లల భవిష్యత్తుకోరే ప్రతిపౌరుడూ ఖండించాలి.

—జీ బాబూరావుయాదవ్
కన్వీనరు, పింజమూరు మండల పింజమూరు బి సి అసోసియేషన్.

### గోపాలరెడ్డిగారు పాల్గొనడంబాగాలేదు!

18 తేది నెల్లూరులో జరిగిన మహాత్మా గాంధీ విగ్రహావిష్కరణ సభలో ఎన్ టి రామారావుతోటి డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు పాల్గొనడం నాబోటి కాంగ్రెస్ అభిమానులకు మింగుడు పడడంలేదు. విద్యార్థిదశనుండి స్వాతంత్ర్య సంగ్రామంలో ముందువడిచి, స్వార్థరహితంగా, నీతి నిజాయితీలతో రాజకీయ జీవితం గడిపిన గోపాలరెడ్డిగారు - స్వాతంత్ర్యానంతరం తన జీవితాన్ని ధనార్జనకే అంకితంచేసి; కల్లబొల్లి కబుర్లతో, సినిమా గ్లామర్‌తో ప్రజలను మభ్యపెట్టి అధికారంలోకివచ్చి; మూర్తీభవించిన అవినీతిపరత్వంతో, స్వార్థపరత్వంతో బంధుప్రీతితో అల్లుళ్ళకు కొడుకులకు రాజ్యాన్నిపంచి,

జనవాణి

ప్రజలను పలురకాలుగా పీల్చిపిప్పిచేసిన ఎన్ టి రామారావు వంటి కుహనా నాయకుడితోకలిసి వేదిక పంచుకోవడం నాబోటి వారికి మనస్తాపం కల్గించింది.

పైపెచ్చు, అది మహాత్మాగాంధి విగ్రహావిష్కరణ సభకావడం ఇంకా బాధాకరమైన విషయం. గోపాలరెడ్డిగారు విగ్రహావిష్కరణ జరిపి, ఎన్ టి ఆర్ అతిథిగా హాజరైవుంటే ఎవ్వరూ ఆక్షేపించివుండేవారుకాదు. గాంధీగారి బొమ్మ ఆవిష్కరణకు గోపాలరెడ్డిగారికంటే అర్హులు ఎవరూవుండరు.

గోపాలరెడ్డిగారు తన అభిమానులు, కాంగ్రెసువాదులు, స్వాతంత్ర్యయోధుల మనోభిప్రాయాలు గమనించి, ఇకముందైనా ఇటువంటి కపట రాజకీయ వాదుల సభలకు హాజరు కాకూడదని నా మనవి.

గూడూరు —వై. కృష్ణారెడ్డి.

### ఈయన తిరిగేది ఏ సి కారుకాదా?

మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి రామారావు నెల్లూరు గాంధీ విగ్రహావిష్కరణ సభలో మాట్లాడుతూ, ఈనాటి కాంగ్రెస్ వాదులు ఏ సి కార్లలో జల్సాగా తిరుగుతూ నీచగుణంతో వ్యవహరిస్తున్నారని విమర్శించడం విడ్డూరంగా వుంది. గురివిందగింజ సామెతను జ్ఞప్తికితెస్తున్నది. ఎన్ టి రామారావుగారు ఏ సి కారులో తిరగడంలేదా? అబిడ్స్‌లోని ఆయనఇంట్లో వున్న ఎయిర్ కండిషనర్ల సంఖ్య ఎంత? జూబిలీహిల్స్‌లో తన అల్లుడికి కట్టించిన వైట్‌హౌస్ మొత్తాన్ని ఎయిర్ కండిషన్ చేయించలేదా? ఏసి కార్లలో తిరగని తెలుగునాయకు లెవరున్నారు? తాము ఒకవైపు ఆ సుఖం అనుభవిస్తూనే, ఇంకొకవైపు కాంగ్రెస వారిని వేలెత్తి చూపడానికి ఎన్టీ ఆర్‌కు నోరెట్లావచ్చింది?

పిల్లకొంత్రికింద జరిగిన ఎన్నికల్లో నెల్లూరుజిల్లా ప్రజానీకం తెలుగుదేశంవారి అన్నప్రతివాద్ని తిరస్కరించారు; సాక్షాత్తు ఎన్టీ ఆర్- అభ్యర్థి ఒక కావలనియోజకవర్గం నుంచి గెలవలేక పోయాడు. ప్రజలచేత ఇంత అవమానితుడైన వ్యక్తి, తన తప్పులను తెలుసు

—తరువ 8 వ పేజీలో

### జిల్లా రైతాంగానికి అపురూప బహుమానం

# లాభాల పంట పండించే పామ్ఆయిల్ చెట్ల పెంపకం

చింతలదీవిలోని పరిశోధనా స్థానాన్ని గుంటూరుజిల్లాకు తరలించాలని కొందరు తీవ్రంగా ప్రయత్నించినా, అప్పట్లో వ్యవసాయ విశ్వవిద్యాలయం పాలకవర్గ సభ్యులుగావున్న శ్రీ జెంజాల పాపిరెడ్డి కృషివల్ల దాన్ని చింతలదీవిలోనే కొనసాగించారు. ఐతే ఇప్పటివరకువున్న పరిశోధనాస్థానాలు ఎప్పుడో స్థాపించినవేతప్ప గత పది సంవత్సరాలలో ఇంతవరకు కొత్తగా నెల్లూరుజిల్లాకు ఏమీ రాలేదు. 1990 నుంచి నెల్లూరు జిల్లా దశ మారి పట్టింది. అందులో ఒకభాగమే పెట్లూరు దగ్గర నిమ్మ పరిశోధనాస్థానం, ముత్తుకూరులో మత్స్యక్షేత్రం, సర్వేపల్లిలోని పామ్ఆయిలు నర్సరీ, జిల్లాలో స్థాపించనున్న పామ్ఆయిలు ప్రాసెసింగు కర్మాగారం. వీటిలో ఒక్క పామ్ ఆయిలు ప్రాజెక్టే 20-25 కోట్ల రూపాయలతో కూడింది. వీటివెనుక శ్రీ జనార్ధనరెడ్డిగారి కృషి వ్యవసాయమంత్రిగా మొదలై ముఖ్యమంత్రిగా కొనసాగడం మనకు తెలిసిందే. అందుకు ఆయనకు ఒక వ్యవసాయ శాస్త్రవేత్తగా, జిల్లావాసిగా అభిమానంగం పొందుతూ అభినందనలు తెలియజేస్తున్నాను.

పామ్ఆయిలు సమగ్ర పథకంనెల్లూరు జిల్లాలో 5000 ఎకరాలకు వర్తింపజేస్తూ దీనికి నర్సరీ, ప్రాసెసింగు కర్మాగారంలతోసహా 20-25 కోట్ల రూపాయల ఖర్చు అవుతుంది. సర్వేపల్లిలోని నర్సరీలో అక్టోబరు 91 నాటికి లక్ష పామ్ ఆయిలు మొక్కలను పెంచి రైతులకు సరఫరా చేయాలి. అంటే 20-25 కోట్ల రూపాయల పథకానికి సారథులు జిల్లారైతులే. వారు తోటలు పెంచి, చెట్లు కాపుకొచ్చిన తరువాత ప్రాసెసింగు ఫ్యాక్టరీకి పని తగులుతుంది.

నెల్లూరుజిల్లా రైతాంగానికి పామ్ఆయిల్ చెట్లు కొత్త. అందుకని పామ్ఆయిల్ తోటల పెంపకంలోని ఆశయం, సాగు వివరాలు చూద్దాం.

గత కొన్ని సంవత్సరాలుగా వంటనూనెల దిగుబడి తగినంత లేకపోవడంతో వాటి ధరల పెరుగుదల అధికంగా వుంది. మనకు ప్రధానంగాగల వంటనూనెలు, వేరుశనగ, పొద్దుతిరుగుడు, కుసుమ, ఆముదం, నువ్వులు, ఆవాలు, కొబ్బరి, తవుడు. వీటి దిగుబడులు చాలినంత లేనందున మనం సాలీనా 1600 - 2000 కోట్ల విలువైన విదేశీ మారకద్రవ్యాన్ని ఖర్చుచేసి 5-10 లక్షల మెట్రిక్ టన్నుల పామ్ ఆయిలు మూనెను దిగుమతి చేసుకుంటున్నాం.

పామాయిలు చెట్లను తక్కువ మండలాల్లో తగినంత గాలిలో తేమవున్న ప్రాంతాల్లో, ఒకమోస్తరు సారవంతమైన పొలంలో సాగు చేయవచ్చు.

నిపుణుల కమిటీ నివేదిక ఆధారంగా భారత ప్రభుత్వం, ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, మహారాష్ట్రంలో దాదాపు 8 లక్షల హెక్టార్లను పామ్ ఆయిల్ తోటల పెంపకానికి గుర్తించింది. ఐయారు దెశ్నాలతీ విభాగంవారు పైలట్ పథకంగా 2500 హెక్టార్లలో ఉద్యానవన విభాగంద్వారా ఆంధ్రప్రదేశ్‌లో 1000 హెక్టార్లలో, కర్ణాటకలో 1000 హెక్టార్లలో, మహారాష్ట్రలో 500 హెక్టార్లల్లో పామ్ఆయిలు తోటల పెంపకం చేపట్టారు.

> డాక్టర్ శిద్దారెడ్డి ఈశ్వరరెడ్డి
> అసోసియేట్ ప్రొఫెసర్
> వ్యవసాయ విశ్వవిద్యాలయం

ఆంధ్రప్రదేశ్‌లో ఉద్యానవన విభాగం వారు 1989 నుంచి తూర్పు గోదావరిలో 400 హెక్టార్లల్లో పశ్చిమ గోదావరిలో 400 హెక్టార్లలోనూ, కృష్ణా జిల్లాలో 200 హెక్టార్లలోనూ పామ్ఆయిల్ తోటల పెంపకం చేపట్టారు. ఈ ప్రాంతాల రైతులను సహకార సంఘాలుగా సంఘటితం చేసి పశ్చిమ గోదావరి జిల్లాలో నూనె తీసే కర్మాగారాన్నికూడా నెలకొల్పుతున్నారు.

ఇంత ప్రాముఖ్యతగల పామ్ ఆయిలు తోటలు, నూనెకర్మాగారం నెల్లూరుజిల్లాలో కూడ మనం త్వరగా చూడవచ్చు.

పామాయిలు మొక్కలను రైతులు తోటల్లో పెంచేందుకుగాను నర్సరీ ఏర్పాటు చేసి సరఫరా చేస్తారు.

తోటలు నాటేందుకు ముందు 3-4 సార్లు పొలాన్ని మెత్తగా దుక్కి చేసి తయారుచేసుకోవాలి. మొక్కలను త్రికోణాకారంలో మొక్కకు మొక్కకు మధ్య 9 మీటర్ల దూరంలో నాటాలి.

#### గుంటలు

60 × 60 × 60 సెం. మీ. పరిమాణం గల గుంటలను 9 మీ. దూరంలో త్రవ్వి, ఎండు ఆకులు, చెత్త వేసి తగులబెట్టాలి. గుంటలనుంచి తీసిన మట్టిలో ఒక కిలో వేపపిండి, 30 కిలోల పశువుల ఎరువు, 500 గ్రాముల సూపరుఫాస్ఫేటు, 100 గ్రాముల బి. హెచ్. సి. పొడి బాగాకలిపి తిరిగి గుంటలను నింపాలి. అప్పుడు గుంటలకు నీరు పెడితే, గుంటలలోని మట్టి అణుకుంటుంది.

#### మొక్కలను నాటడం

గుంట మధ్యలో 12-18 నెలల వయసున్న మొక్కను జూన్-జూలై నెలల్లో, మట్టిముద్దతోసహా నాటాలి. నర్సరీలో మొక్కలను పాలిథిన్ సంచులలో పెంచుతారు. సంచిని జాగ్రత్తగా కోసివేసి, వేళ్ళదగ్గర మట్టి ఏమాత్రం కదలకుండా జాగ్రత్త తీసుకోవాలి. అవసరాన్నిబట్టి నీరు కట్టుకోవాలి. ఎలుకలు, ఉడుతలు లేత మొక్కలను పాడుచేస్తాయి. వాటినుంచి మొక్కలకు రక్షణ కల్గించేందుకు తీగవలను చుట్టూ ఏర్పాటుచేసుకోవాలి.

#### ఎరువులు

ఆయిల్ పామ్ చెట్లకు అధికంగా నత్రజని ఎరువులు వేయడంవల్ల ఆకులు, గెలలసంఖ్య పెరిగి, గెలలు బరువుగా కూడ వుంటాయి. కాని, కొన్ని సార్లు

—తరువాయి 10 వ పేజీలో



## గ్రంథసమీక్ష

### స్తంభించిన సాయంత్రం

(రచయితలు: ఒబ్బిని సన్యాసరావు. ప్రతులకు: ఓ. పద్మావతి: 5/82/1, భవానీనగర్, హైదరాబాదు 500038 వెల: రు10లు.)

ఇది 41 వచనకవితల సంపుటి. భావవ్యక్తీకరణమే కవిత్వమనీ, ఛందోరహితంగా వ్రాయడమే సులభమనీ భావించిన ఆధునిక కవులు, వచనకవితల పేరుతో కోకొల్లలుగా వ్రాసి పుస్తకాలుగా ప్రచురిస్తున్నారు వాసికన్నా రాశి ఎక్కువై, కవిత్వపుపాలు తక్కువై, స్వేచ్ఛగా వ్రాస్తున్నారు. ఆలోచనకన్నా ఆవేశం అధికమై ఏదో చెప్పాలన్నతపన, ఏదో వ్రాయాలన్న కోరిక బలీయంకాగా, కలం చేపట్టి యిష్ట-వచ్చినట్లు వ్రాస్తున్నారు. వారేమి చెప్పబోతున్నారో, ఏమి వ్రాస్తున్నారో పాఠకులకు అర్థంకానిపరిస్థితి ఏర్పడింది. కవిత్వం సౌందర్యమయం అనే మాటను ఏనాడో మరచిపోయారు. కావ్యం విశ్వశ్రేయస్సును కోరేభావం అడుగంటింది సమాజంపైన ఏదోకోపం, రాజకీయాంశమైన ద్వేషం, జీవితంలో నిరాశ కనిపిస్తున్నవిలై, స్వైరాచరణలు వెలు

—తరువాయి 10వ పేజీలో



జిపత్రి ఉద్యోగి కేశవరావు కుమార్తె ఉమామహేశ్వరి, జె కాంతారావు వీరి వివాహం ఇటీవల నెల్లూరులో జరిగింది.

## సణుగుడు

### * మునక సర్టిఫికేట్ ప్లస్ ముప్పయ్‌వేలు-ఈజ్ ఈక్వల్ టు తెలుగుగంగఉద్యోగం?

### * యు ఎ ఓ ఆర్థికనిపుణుడుగా బుచ్చి ప్రొఫెసర్

గణితశాస్త్రంలో ఇటువంటి ఈక్వేషన్లు వస్తాయని శ్రీనివాస రామానుజన్ కూడా కలగనివుండడు. తంగేడుచెట్లను చవులూరించే సీడ్‌లెస్ దానిమ్మచెట్లుగా మార్చగల పరుసవేది నిపుణులైన తెలుగుగంగ అధికార్లు కనిపెట్టిన సరికొత్త ప్రయోగం ఇది. మునక సర్టిఫికేట్ ప్లస్ ముప్పయ్‌వేలు ఈజ్ ఈక్వల్టు తెలుగుగంగ ఎల్ డి సి పోస్టు అన్న ఈక్వేషన్ తెలియనివాడెవ్వడు రాపూరు ప్రాంతంలోలేడు. తాము ప్రతిపాదించిన సిద్ధాంతానికి అంత విస్తృత ప్రచారమిచ్చారు అధికారులు.

తెలుగుగంగ ప్రాజెక్టుక్రింద మునిగిపోయే భూములుగల రైతులకుటుంబంలోని ఒకరికి ప్రాజెక్టు కార్యాలయాలలో పని చూపించాలని ప్రభుత్వం నిర్ణయించింది. కొత్తపరిశ్రమలు ప్రాజెక్టుల నిర్మాణ సమయంలో ఇటువంటి ఉత్తర్వులురావడం సాధారణమే! అయితే సాధారణ విషయాలను అసాధారణరీతిలో తమ స్వంత మేలుకు అనుగుణంగా మల్చుకోగలిగిన తెలుగుగంగ అధికారులకు ఇదీ అన్నే ఉపయోగపడుతూంది.

తెలుగుగంగ మునక భూములకుచెందిన రైతుల కుటుంబాలు బాగా వెనుకబడినవి. వారిలో ఉద్యోగానికి అర్హతమైన, విద్యావంతులైన యువతీయువకులసంఖ్య తక్కువగావుంది. దీన్ని అవకాశంగా తీసుకొని ఇతర ప్రాంతాలకు చెందినవారికి, వీరి పేరుతో ఉద్యోగాలు కట్టబెడుతున్నారట. అయితే ఎక్కడా తప్పిదం కన్పడకుండా, జాగ్రత్తగా, శాస్త్రంప్రకారం జరిపిస్తున్నారీ కుంభకోణాన్ని!

అటెండర్ పోస్టు అయితే ఒకరైవేలు, ఎల్ డి సి ఉద్యోగానికి ముప్పయివేలు ముడుపు ముందుగానే స్వీకరిస్తున్నారు. ఆ అభ్యర్థులకు, ఉద్యోగం అవసరంలేని రైతులకుమధ్య ఒక బేరంకుదిర్చి, రైతుకు

> డోలేంద్ర

రావలసి మొత్తంలో పది, పదిహేనువేల మునక పరిహారం చెక్కు ఆ అభ్యర్థుల పేరుతో జారీచేస్తున్నారు. ఫలితంగా వీరు సైతంమునక రైతులుగా 'అధికారిక గుర్తింపు' పొందుతున్నారు. దానితో ఉద్యోగానికి దారి ఏర్పడుతున్నది.

ఇట్లాదొడ్డిదారిన ఉద్యోగాలుపొందినవారి సంఖ్య పదిహేను వరకు వుందని వినికిడి. ఈ లావా కుంభకోణంలో అధికారులతో పాటు కొందరు రాజకీయ వాదులూ భాగం పంచుకున్నట్లున్నారు.

స్పెషల్ కలెక్టర్ శ్రీ సుందరకుమార్ దృష్టికి ఈ కుంభకోణం వార్త వచ్చినట్లు లేదు. తెలిస్తే, సహించే అధికారి కాదను కుంటాను.

• • •

—తరువాయి 8 పేజీలో

## నెల్లూరు బజ్జొల్లొ విహార్యకుడు

### జనార్దనరెడ్డి జన్మదినం

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దనరెడ్డి జన్మదినం సందర్భంగా 20 తేది సూళ్లూరుపేట చెంగాళమ్మ దేవస్థానంలో ఎమ్మెల్యే శ్రీ పసల పెంచలయ్యగారు పూజలు జరిపారు. కాలాటి కాలనీవాసులు, నేలపట్టు హరిజనులకు ఇళ్ళస్థలాల పట్టాలు పంచారు. సూళ్ళూరుపేట బస్టాండు కార్మికులు స్వీట్లు పంచారు.

అదేరోజు నెల్లూరులో కృష్ణారావు ఫ్యాన్స్ అసోసియేషన్ తరఫున అన్నదానం జరిగింది. శ్రీ చదలవాడ కృష్ణమూర్తి ముఖ్య ఆతిథ్యం నెరపారు.

### విద్యుత్ మంత్రి

రాష్ట్ర విద్యుత్, మైనర్ ఇర్రిగేషన్ల మంత్రి శ్రీ డి.ఎల్. రవీంద్రారెడ్డి 26 తేది నెల్లూరు వస్తున్నారు. కలిగిరి, మర్రిగుంట, ఎర్రబల్లి, చౌటకొండ, వింజమూరు, కలిగిరి అదితర గ్రామాలలో 28 తేది రాత్రివరకు పర్యటిస్తారు.

ఎమ్మెల్యే శ్రీ మాదాల జానకిరాంతో తనకున్న స్నేహానికి గుర్తుగా, ఆయన నియోజకవర్గ పర్యటన పెట్టుకున్నట్లుంది మంత్రి. పర్యటనకు ఈ తేదీ పెట్టే రకం కాదు కదా, జానకిరాం. నియోజకవర్గానికి మేలుచేసే పనులేవి సాధిస్తారో చూడాలి.

### రంగడి తిరునాళ్ళ

రంగనాయకులస్వామి తిరునాళ్ళ 23 తేది ప్రారంభమౌతున్నది. 28 తేది గరుడసేవ, 1 తేది కళ్యాణం, 2 తేది తేరు ఆకర్షణలు. స్వామివారి ప్రభను తిరిగి పునరుజ్జీవింపజేయడానికి ధర్మకర్తల మండలి అధ్యక్షుడు శ్రీ మంకు వెంకటేశ్వర్లు విస్తృత ఏర్పాట్లు చేస్తున్నారు.

### వివేక కాంగ్రెస్ చేరిక

శ్రీ ఆనం వివేకానందరెడ్డి 17తేది శుభ ముహూర్తంలో శ్రీ రాం అధ్యక్షుని సమక్షంలో కాంగ్రెస్ సభ్యత్వం స్వీకరించారు. ఈ కార్యక్రమం ఇందిరాభవన్‌లో జరిగింది; శ్రీ ఆనం సంజీవరెడ్డి హితోపదేశ ప్రసంగంకూడా వుండింది.

శ్రీ వివేకానందరెడ్డి రెండు మూడు రోజుల్లో కుర్రకారు శిష్యగణాన్ని వెంటబెట్టుకొని హైదరాబాదుకు తరలిపోయి, ముఖ్యమంత్రిని గౌరవ పురస్కారంగా దర్శించి, ఆశీర్వాదాలు పొందిస్తాడట.

వివేకానందరెడ్డి ఇప్పటికే విలువైన తనకాలాన్ని, శక్తిని వృధాచేసుకున్నాడు. ఇకనైనా నిలకడతనం విశ్వాసపాత్రంతో కష్టపడి పనిచేసి, జరిగిన నష్టాన్నికూడా పూడ్చుకొని పైకిరావాలని మా ఆకాంక్ష.



వ్యవసాయ విశ్వవిద్యాలయం అవార్డును గవర్నర్ కృష్ణకాంత్ నుంచి అందుకుంటున్న నెల్లూరు వరి పరిశోధనాలయ- డైరెక్టర్ డాక్టర్ పి. రంగారెడ్డి

### వన్‌టౌన్ ఎస్ ఐ కి 15 రోజుల జైలుశిక్ష

నెల్లూరు వన్ టౌన్ సబిన్స్పెక్టర్ శ్రీ నవాబ్‌జాను ఈ రోజు (22 తేది) నుంచి మార్చి 4 తేది వరకు రిమాండ్‌కు పంపుతూ నెల్లూరు రెండవ అదనపు మేజిస్ట్రేట్ ఉత్తర్వు జారీచేశారు. పోలీసు వర్గాలలో తీవ్రసంచలనం సృష్టించింది ఆదేశం.

శ్రీ నవాబ్‌జాన్ మేజిస్ట్రేట్ కోర్టులో మూడు క్రిమినల్ కేసులకు సంబంధించి సాక్ష్యం చెప్పవలసివుండట. అయితే కోర్టు ఎన్నిసార్లు సమన్లుపంపినా ఆయన లెక్కచేయలేదట. దీనితో మేజిస్ట్రేట్ నాన్‌బెయిలబుల్ వారంట్ జారీచేశారట. దానితో ఎస్ ఐ మొన్న 15 తేది కోర్టుకు హాజరై రెండుకేసులకు సంబంధించి సాక్ష్యం చెప్పారట. అయితే వారంట్‌ను తిరస్కరించి, మేజిస్ట్రేటు చెప్తున్నా వినిపించుకోకుండా కోర్టునుంచి వెళ్ళిపోయాడట. దాంతో ఆరోజు తర్వాత ఈరోజు జిల్లా కోర్టులో యాంటిసిపేటరీ బెయిల్‌కు దరఖాస్తు చేశారు. అయితే న్యాయమూర్తి దానిపై నిర్ణయాన్ని ఈనెల 25 తేదీకి వాయిదా వేశారు. ఏదీ లేని పరిస్థితుల్లో ఎస్ ఐ మేజిస్ట్రేటు వద్దకువెళ్ళి సరెండర్ కావడంతో, మార్చి 4 తేది వరకు రిమాండ్‌కు పంపుతూ ఉత్తర్వు చేశారు.

ఈ తీర్పు వినగానే జిల్లా పోలీసధికార్లందరూ పరుగెత్తుకుంటూవెళ్ళి, లాయర్లను ప్రాధేయపడి, బెయిల్ దరఖాస్తు చేయించి, సాయంత్రానికి ఆతిథ్యంమీద బెయిల్‌పొంది, ఎస్ ఐ ని విడుదల చేయించారు.

పోలీసులలో క్రమంగా పెరుగుతూ వస్తున్న ఖాకీక్రౌర్యం, అహంకారాలు కోర్టులకు సంబంధించికూడా ప్రతిఫలిస్తున్నాయి. న్యాయమూర్తులు అప్పుడప్పుడు ఇట్లా చట్టాన్ని కఠినంగా అమలు పరిస్తేతప్ప వారిలో మార్పురాదు.

### చేజర్ల ఎస్ ఐ పై మండలాధ్యక్షుడి దాడి!

చేజర్ల మండలాధ్యక్షుడు శ్రీ కొమ్మి లక్ష్మయ్యనాయుడు, ఆ స్టేషన్ సబ్‌ఇన్స్పెక్టర్ సి. హెచ్. వెంకటేశ్వరరావుపై దౌర్జన్యంచేసి, లాకప్‌లోవున్న ఇద్దరు నిందితులను విడిపించుకపోయారని కేసు రిజిష్టరైంది. నూతక్కివారి కండ్రిగ గ్రామానికిచెందిన సిమెంట్ పైపులు రెండింటిని దొంగిలించారనే ఆరోపణపై ఇద్దరు గ్రామస్థులను ఎస్ ఐ అరెస్టుచేశారట. సర్పంచ్ ఫిర్యాదుపై ఇది జరిగినట్లుంది. లాకప్‌లో వున్నవారిని విడిపించుకోవడానికి లక్ష్మయ్యనాయుడు 50 మందితో దండెత్తివచ్చాడని, కానిస్టేబుళ్ళను ప్రక్కకునెట్టేసి, అడ్డువచ్చిన ఎస్ ఐ ను క్రిందపడేసి కొట్టి, నిందితులతో కలిసి వెళ్ళిపోయాడని పోలీసుల కథనం.

అయితే లక్ష్మయ్యనాయుడు వాదం ఇంకొకరకంగా వుంది. ఈ పైపులు మండలానికి చెందినవట. పంచాయతీకి సంబంధం లేదట. గ్రామ కక్షను అర్థం పెట్టుకొని, సర్పంచ్ తప్పుడు ఫిర్యాదుచేస్తే, లక్ష్మయ్య ముందుగానే ఎస్ ఐ కి వాస్తవం చెప్పాడట కాని పోలీసులే అది వినిపించుకోకుండా ఫిర్యాదు ప్రకారం ఇద్దర్ని అరెస్ట్‌చేసి, లాకప్‌లో పెట్టి చిత్రహింసలు పెట్టారని; ఇది అన్యాయమని చెప్పబోయిన తనముందే వారిని లాఠీతో బాదారని, అడగడానికి వచ్చిన రైతులనుసైతం కొట్టారని, ఈ ఘర్షణలో నిందితులు పారిపోయారని లక్ష్మయ్య చెప్తున్నారు.

—కొరవ 8 పేజీలో





# పెట్రోలు కరువుతో హీరోలు స్కూటర్లపై తిరుగుతున్నారు!

గల్ఫ్‌యుద్ధం మూలంగా ఏర్పడిన పెట్రోలు కొరతను పరిష్కరించుకోడానికి కొన్ని సినిమా కంపెనీలలో మొపెడ్లు, స్కూటర్లు కొన్నారు. ఇదివరకు షూటింగ్ ప్రోగ్రాంగురించి ప్రొడక్షన్ మేనేజరు కారులోనో, ప్రైవేట్ టాక్సీలోనో అందరి ఇళ్ళకూ వెళ్ళి చెప్పి వస్తుండేవాడు. ఇప్పుడు స్కూటర్‌లోనే వెళ్ళి చెప్పిరావడం జరుగుతోంది. షూటింగ్ ముగిశాక పెద్ద ఆర్టిస్టులుతే కంపెనీకారులో ఇళ్ళకు చేరగా, ఒంటరిగా ఇంటికి బయలుదేరేవారు. దర్శకునితోపాటు అసిస్టెంట్ డైరెక్టర్లు, ఇతర సాంకేతిక నిపుణులూ

### మద్రాసు సినిమావార్తలు

కాడలో ఝుర్రెత్తేస్తున్నారు. కాలానికి తగ్గట్టు మారక తప్పడంలేదు. తల్లి విజయ నిర్మలకు స్వంత పెట్రోల్‌బంకు వుండి కూడా హీరో నరేష్ పొదుపునిమిత్తం 'కైనెటిక్‌హోండా' కొన్నాడంటే ఆలోచించండి!

### విశ్వనట చక్రవర్తి ఎస్. వి. రంగారావు

నటనకు భాష్యంచెప్పిన స్వర్గీయ ఎస్. వి. రంగారావు నటించిన పలుచిత్రాలలోని ముఖ్యమైన సన్నివేశాలను ఏర్చి కూర్చి, ఆయన సతీమణి ఎస్. వి. లీలావతి 'విశ్వనట చక్రవర్తి' అనే చిత్రాన్ని ఎస్. వి. ఆర్. ఆర్ట్ ఫిలిమ్స్ పతాకంలో తయారు చేస్తున్నారు. చిత్రం మొదటిభాగం నలుపు-తెలుపులోనూ, రెండోభాగం వర్ణరంజితంగానూ వుంటుంది. త్వరలోవిడుదల.

### మితిమీరిన చిత్రాలు

తీసిన చిత్రాలు అపజయం పొందినా

—తరువాత 11 వ పేజీలో

# చిరంజీవిపై అసూయతో ప్రతిబంధ్ నిషేధ ప్రయత్నం!

హిందీలోకి డబ్‌చేయబడిన 'స్టేట్‌రౌడీ' చిత్రంద్వారా ఉత్తరాదివారికి పరిచయం గావింపబడి, 'అంకుశం' హిందీ 'ప్రతిబంధ్' ద్వారా అగ్రశ్రేణి హిందీహీరోల జాబితాలో చిరంజీవి చేరిపోయినందుకు, కొందరు బొంబాయివాలాలు భరించలేకపోతుంటే; కొత్తగా సుభాష్‌ఘయ్ దర్శకత్వంవహించే హిందీచిత్రంలో చిరంజీవి బుక్కావడం అక్కడివారిని మరింత తికమక పెట్టింది. అందుకని ఒక పథకం ప్రకారం 'ప్రతిబంధ్' చిత్రంపై ధ్వజమెత్తారు. సుమారు 15 'పాయింట్‌లెస్ వయొలెన్స్'వున్న 'ప్రతిబంధ్' చిత్రాన్ని ప్రాంతీయ సెన్సార్ బోర్డు వారు ఎలా అనుమతించారని ఒక ఆక్షేపణ కొత్తగా లేవదీశారు. 'అంకుశం'లో లేని ఆక్షేపణలు, విడుదలై నాలుగు నెలలు పైగా

### విడుదలైన నాలుగు నెలల తర్వాత సెన్సార్ ఆక్షేపణ

ప్రజాభిమానం చూరగొన్న ఈ చిత్రం విషయమై హైదరాబాద్‌లోని ప్రాంతీయ సెన్సార్ కార్యాలయానికి సెంట్రల్‌బోర్డ్ ఆఫ్ ఫిలిమ్ సర్టిఫికేషన్‌నుంచి ఘాటుగా ఉత్తరాలు వెళ్ళాయి. కేంద్ర సెన్సార్ బోర్డు చేర్మన్ శక్తిసామంత దర్శక నిర్మాత. ఆయనపై కొందరు హిందీ హీరోలుకూడా ఒత్తిడితెచ్చి 'ప్రతిబంధ్' చిత్రాన్ని నిషేధించడానికి ప్రయత్నిస్తున్నట్లు తెలుస్తోంది. విడుదలైన నాలుగు నెలలతర్వాత ఒకచిత్రంగురించి సెన్సార్ పట్టించుకోవడం విడ్డూరమేమరి. సినిమా రంగంలోనూ ప్రాంతీయభేదాలు విస్తృత రూపం ధరిస్తున్నాయి.

### "ఆడపిల్ల"

కొందరు నిర్మాతలు ఈ మధ్య ఒక తెలివైన పని చేస్తున్నారు. ఒక విభిన్నమైన ఇతివృత్తం తమకు నచ్చినప్పుడు అది

—తరువాత 11వ పేజీలో

### నెల్లూరులో "మౌన సంగ్రామం"

నెల్లూరు పొదలకూరు రోడ్డులో వున్న జయచంద్రారెడ్డి భవనంలో ఫిబ్రవరి 10న పి. రాజశేఖరరెడ్డి పూజా కార్యక్రమాలు, నేదురుమల్లి పద్మనాభరెడ్డి క్లాప్‌తో ప్రారంభమైన "మౌన సంగ్రామం" చిత్రానికి, గతంలో కె. విశ్వనాథ్, ఎ. కోదండరామిరెడ్డి ప్రభృతుల వద్ద శిష్యరికం చేసిన పి. శివకుమార్‌రెడ్డి దర్శకుడు. నెల్లూరు పరిసరాలలో ఫిబ్రవరి 25 వరకు మొదటి షెడ్యూల్ జరిగింది. సురేష్ పక్కన బొంబాయితార 'శ్వేతనాయిక' నటిస్తోంది. రంగనాథ్, నూతన్‌ప్రసాద్, సంజీవి, రాధాకృష్ణమూర్తి ఇతర పాత్రధారులు. మాటలు: సత్యానంద్. సంగీతం: ఇళయరాజా. కెమెరా: ఎజా. సుధాకర్‌రెడ్డి, రవీంద్రనాథరెడ్డి. కూర్పు: పి. నంద కుమార్‌రెడ్డి. సమర్పణ: పి. శ్రీనివాస రెడ్డి. నిర్మాతలు: బి. కృష్ణమాచార్య, పి: సుబ్బరామిరెడ్డి, డి. ప్రదీప్ రెడ్డి, పి. ఇంద్రసేన.

## సినిమా

(9 వ పేజీ తరువాత)

కొందరు చిన్న చిత్ర నిర్మాతలు సైతం తమ తమవరి చిత్రాలకు ఎట్లా సర్వానాలు చేస్తున్నారో, సీన్లకు ఎవరు ఫైనాన్సింగ్ చేస్తున్నారో అంతా వింతగా వుంది. కొందరు ఒకేసారి రెండుమూడు చిత్రాలకు పూనుకుంటున్నారు. ప్రేక్షకులకేమో తెలుగు సినిమాలంటే మోహం మొత్తిపోయింది.

### రాధాకల్యాణం

పదేళ్ళ క్రితం సినిమారంగంలో ప్రవేశించి, 160 చిత్రాలలో నటించిన రాధకు ఈ సంవత్సరంలోనే వివాహం జరగవచ్చు. వరుడు తమిళ నిర్మాత కె. ఆర్. జి. పుత్రుడు గంగాధర్. ఆ నిర్మాత 'మనైవి వ దనేం' (భార్య వచ్చినవేళ) అనే తమిళచిత్రాన్ని తీస్తున్నప్పుడు ఆ చిత్రంలో నాయిక అయిన రాధకు తరచు షూటింగ్ స్పాట్‌కు వచ్చే గంగాధర్‌తో పరిచయమైంది. చూపులు కలిశాయి; మనసులు కలిశాయి; రాధ తల్లి సరసమ్మ ఆమోదించింది; కె. ఆర్. జి. అంగీకరించారు. ఇక మూడుముళ్ళు పడటమే తరువాయి. రాధకు ఇటీవలం బాగా తగ్గిపోయింది. పైగా ఎందరో కొత్తకొత్త అమ్మాయిలు తక్కువ పారితోషికంతోనే హీరోయిన్లు అయిపోతున్నారు. ఈ పోటీకి తట్టుకోలేకపోతున్నదిరాధ అందుకే వివాహం తప్పనిసరి అయింది. కళ్యాణ శ్రమం.

### హీరోగా హీరోయిన్ సోదరుడు

భానుప్రియ సోదరుడు గోపి ఇప్పుడొక తమిళచిత్రంలో నటిస్తున్నాడు. అందులో డాన్సు ఇస్తే, అవివాహిత తరువరిచిత్రంలో తాను నటిస్తానని భానుప్రియ చెప్పిందట. ఆయన వయసు పాతిక. అతను తన తమ్ముడని చెప్పుకుంటే తనవయసు ఇంకా ఎక్కువగా అందరూ అనుకుంటారు గనుక ఆమె తన తమ్ముణ్ని 'అన్నయ్యా!' అని పిలుస్తుంది. తారలపాట్లు ఇట్లా వుంటాయి.

### ప్రతిబంద్

(9 వ పేజీ తరువాత)

ప్రేక్షకులెవరైనా ఏదో చూడా ముందుగా తెలుసుకోడానికి దానిని ఏ పత్రికలోనైనా సీరియల్‌గా వచ్చేలా చూస్తున్నారు. అటు పైన పాఠకుల అభిప్రాయాన్ని సేకరించి, పాఠకులకు నచ్చితే, దానిని చిత్రంగా తీయడానికి పూనుకుంటున్నారు. ఆ కోవలోనిదే కృష్ణ ఎంటర్‌ప్రైజెస్ "ఆడపిల్ల". దీనికి కారవాహన 'ఆంధ్రపత్రిక'లో తీరోరాస్తున్న "రాలుతున్న పూలతోట" సీరియల్ నవల ఆధారం. ఆడపిల్ల పుట్టిందంటే భయపడిపోయే తల్లిదండ్రులు ఈనాడూ చాలా మంది ఉన్నారు. అందుకని గర్భంలో ఉన్న బిడ్డ ఏదో స్కానింగ్ ద్వారా తెలుసుకుని, ఆడబిడ్డ అయిన పక్షంలో గర్భస్రావం చేయించుకున్న సందర్భాలు కొన్ని లేకపోలేదు. ఆ పరిస్థితులను కథాంశంగా తీసుకుని, స్త్రీ స్వయంకృషితో, ఆత్మవిశ్వాసంతో పురుషునికి దీటుగా ఎదగాలని చాటిచెప్పే కథాంశం ఇది. హరీష్, కిన్నెర, వాణీవిశ్వనాథ్, సంధ్య, జ్యోతి, బాలయ్య, ఆహుతిప్రసాద్, ఎం. వి. ఎస్ హరనాథరావుపాత్రధారులు. దర్శకత్వం: కె వాసు ★

## పాతకాలం కథకు, కొత్తదనం మసాలా చేర్చిన

# తల్లిదండ్రులు

### చిత్ర సమీక్ష

గిద్దలూరు గోపాలరావు

ఈ చిత్రం పేరే చెపుతుంది ఇది ఒక కుటుంబ కథాచిత్రమని. ఒక ఉమ్మడి కుటుంబంలోని మంచిచెడ్డలు, కష్టసుఖాలు, కుటుంబసభ్యులు విడిపోవటాలు, తల్లిదండ్రులు అగచాట్లు పడటాలు, చివరకు ఒకటవటం ఇవన్నీ ప్రేక్షకులముందు వుంచబడ్డాయి. ఇవేగాక ఈనాటి కొంతమంది ప్రేక్షకుల అభిరుచిని అనుసరించి రౌడీయిజం, కొట్లాటలు, హత్యలు, రక్తపాతం కూడా చూపబడ్డాయి. ఇవి మోతాదును మించి, ముఖ్యంగా క్లయిమాక్స్ సన్నివేశాల్లో భయంకరంగా బీభత్సం సృష్టించబడ్డాయి.

గతంలో కుటుంబ కథాచిత్రాలకు పెట్టిందిపేరుగా నిలచిన నిర్మాత ఎ. వి. సుబ్బారావు ఈ చిత్రాన్ని నిర్మించారు. చాలాకాలంతర్వాత ఆయన మరలా చిత్రం నిర్మించినా కుటుంబ కథను ఎన్నుకోవటంలోనే ఉత్తమచిత్రాలపట్ల ఆయన అభిరుచి వెల్లడవుతుంది. కాని, తెలుగు హిందీ చిత్రాలకు దర్శకుడైన తాతినేని రామారావు, కొట్టుకోవటం, తిట్టుకోవటం, రక్తం పారించటం వంటి హింసాత్మక దృశ్యాలు చిత్రించడంలో ఆరితేరినవాడుకాబట్టి ఆ తీరును ఈ కుటుంబచిత్రంలోనూ ఇరికించి మోతాదు సృష్టించారు. అనాటి పాత నిర్మాత కథాభిరుచితో, ఈనాటి ఆధునా తన దర్శకునికథనం అనుభవంతో చిత్రం అటూ ఇటూ రెండు ఆకర్షణలతో సాగుతుంది. దర్శకుడు దృశ్యాలను పదు గిత్తించారు. కథనం వండినందగా కథలో నిండుదనం కనిపించదు. కథ వ్రాసిన పరుచూరి బ్రదర్స్ కథలో కొత్తదనం కోసం ప్రయత్నించారు. కాని అదిఅంతగా ఫలించలేదు. దర్శకుడు ఆరితేరినవాడు కాబట్టి తాను నడిపించిన కథనం వేగంతో కథాబలహీనాన్ని కప్పిపుచ్చారు.

వెంకట్రామయ్య (గుమ్మడి) ఆయన భార్య (జయంతి) ఇందులో తల్లిదండ్రులు. వెంకట్రామయ్య శ్రీమంతుడు. పారిశ్రామిక కంట్రాక్టరు. డబ్బు సంపాదించడంలో న్యాయం పాటించాలన్నది అతని నీతి. ఆయన పెద్దకొడుకు (విద్యాసాగర్) రెండో కొడుకు (వినోద్‌నాగ్) వారి భార్యలు తల్లిదండ్రులకు విధేయులుగా మసలుకొంటూనే, స్వార్థాన్ని పెంచుకుంటూ వుంటారు. ఇక మూడోకొడుకు (ఆనంద్) బాలకృష్ణ నీతిమంతుడు, ఆత్మాభిమానవంతుడు. ఇతను కవిత (విజయశాంతి) అనే అమ్మాయిని ప్రేమిస్తాడు. కుటుంబగౌరవంకోసం ప్రాకులాడే గంద్రిమాట తిరస్కరించి కవితను గుళ్లో పెళ్ళాడుతాడు. ఇల్లువదలి వేరే కాపురం పెట్టాడు. పెద్దకొడుకు, రెండోకొడుకుల స్వార్థబుద్ధివల్ల, పారిస్థు కాంట్రాక్టరుగా వున్న శివరావు(సత్యనారాయణ)కుట్రవల్ల వెంకట్రామయ్యకుటుంబం చెల్లాచెదురౌతుంది. చిన్నకొడుకు ఆనంద్ వారిని ఆదుకుంటాడు. చివరకు తల్లిదండ్రులుగా వంటి భయంకర బీభత్సదృశ్యాలద్వారా అందరూ ఒకటవుతారు.

ఈ చిత్రంలో హీరోయిన్‌కు ప్రముఖమైన పాత్రవుంది. ఈ పాత్రను విజయశాంతి చక్కగా పోషించింది. ఆనంద్ పాత్రలో బాలకృష్ణ రాణించారు. ఈ చిత్రానికి జీవం పోసినటువంటి గుమ్మడి. వెంకట్రామయ్య పాత్రలో తన నటను ప్రదర్శించారు. నిర్మలమీద ప్రేమాభిమానాలు గల తండ్రిగా, కుటుంబ గౌరవం కాపాడే ఇంటిపెద్దగా, అనేకమైన కుటుంబ సమస్యలను, మానసిక వత్తిడులను ఎదుర్కొనే ఉమ్మడికుటుంబసభ్యుడుగా, ఆత్మగౌరవం కాపాడుకొనేవ్యక్తిగా, నీతి, నిజాయితీ గల వ్యాపారవేత్తగా గొప్పగా నటించారు గుమ్మడి. శివరావు పాత్రలో సత్యనారాయణ వరవాలేదనిపించుకున్నారు. పరుచూరి వెంకటేశ్వరరావు, శ్రీలక్ష్మి కొంత హాస్యం అందించారు.

పరుచూరి బ్రదర్స్ మాటలు బాగున్నాయి. అన్నిటికన్నా సుందరం ఫోటోగ్రఫీ టెక్నిక్కులు ఆకర్షణీయంగా వున్నాయి. ★

## పెడత్రోవ పట్టిన యువతి పరివర్తనను హృద్యంగా ప్రదర్శించిన

# ప్రయోజనాత్మక నాటిక- స్త్రీ

### నాటక సమీక్ష

★

సత్యవేటి శ్రీకాంత్

ఇది ఒక వేశ్యజీవిత పరివర్తనాకథనానికి రంగస్థల రూపకల్పన. సహజంగానే ఆ కథావస్తువుకు కావలసిన ముడిపదార్థాల వంటి పాత్రలు. ఒక రౌడీ విటుడు, మరో అమాయక అర్భక విద్యార్థి విటుడూ, ఆదర్శభావాలుగల ఒక యువ పోలీసు అధికారి, విటులను తీసికొనివచ్చే గుంట నక్కలాంటి బార్బరుగాడు వేశ్యనుపాదవను అనువుగారాబట్టుకొనే రాబందుగాడు. నాటికభాగమమం రెండుభాగాలు, మొదటి భాగంలో పతిత జీవనం. రెండవ భాగంలో పరివర్తనానంతరపు సమస్యల తోరణం.

కథావస్తువు సమస్యాత్మకమైనది. దానిని విసుగనిపించకుండా, చాలావరకు రేలికపరిచేందుకు ఎంతో సహజమైన సన్నివేశాలను హాస్యరసాత్మకంగా రచించి వస్తువులకల్లిన్ని కూర్పించారు రచయిత శ్రీ గిద్దలూరు గోపాలరావు.

నాటిక తొలిసన్నివేశం వేశ్య- రౌడీ విటుని తో ప్రారంభమై, ఆ విటుని నిష్క్రమణానంతరం విద్యార్థి విటుని రాకతోనూ, అపై ఎ ఎస్ పి పాత్ర ప్రవేశంతోనూ వేగాన్ని పుంజుకుంటుంది. నాటిక ప్రారంభమైన మొదటి పదినిమిషాలలో పాత్రలు ప్రేక్షకులకు పరిచయం కావడంగాక, కథకు తొలిమలుపుగా "స్త్రీ" లో పరివర్తనకు అలోచనాబీజాలు కల్లించబాయి. ఆదర్శవంతుడైన అఫీసరు బిడ్డమనే కారణాను పరిష్కారంచేసి, క్రియాశీలకమైన, ప్రయోజనీయమైన కర్తవ్యాన్ని చేపడతాడు. విద్యార్థి విటుని మందలించి పొడలేసి, వ్యభిచరిస్తున్న "స్త్రీ" వాదనను విని, ప్రతివాదనను వినిపించి, ఆమెలో ఆలోచన, ఆర్ద్రతగల మినుకు మినుకు మంటున్న మానవత్వాన్ని మేల్కొలుపుతాడు

తనలాగా తన కూతురి జీవితం పాడవకుండా కాపాడుకొనిన "స్త్రీ" అమెను ఇంకొకరి యింట వుంచి గౌరవనీయంగా పెంచుతుంటుంది. కానీ సదరు గౌరవనీయ కుటుంబీకుడూ పరమనీచుడే. వాడికి తోడుగా బార్బరుగాడు. వీరిద్దరూ ఆమెను తిరిగి పాపకూపంలోకి ఎక్కించే ప్రయత్నాలు చేసినా, పావనిగా మారిన పతిత వారికి లొంగదు. రౌడీ విటుడు క్రూరంగా బాధించి తన వాంఛ తీర్చుకో బోతే ప్రతిఘటించి, ప్రాణార్పణ చేసుకుంటుంది "స్త్రీ" పరిస్థితులకు ఒకనాడు బానిసయై అమ్ముడుపోయిన అతివ ఆత్మబలిదానంతో, పరిస్థితులను జయించి అపరాజితగా నిలుస్తుంది.

ప్రేక్షకుల సానుభూతికోసం సృష్టించబడిన దుఃఖాంతంకాదు రచయితసన్నివేశం. (పోషణలో జడ్జిల మెప్పుకోసం చేసిన ముగింపుకూడాకాదు.) పాత్రపరంగా తను యిత తీసికున్న మంచి నిర్ణయం.

తన తల్లిదండ్రులు తనకు పెళ్ళి చేయలేకపోయారు. కుటుంబపరిస్థితులకులొంగి తప్పుత్రోవతొక్కింది తనకూతురు కాగా బ్రతకాలని ప్రాకులాడింది. తనబిడ్డకొరకు వ్యభిచరించింది. కానీ, పరివర్తన చెందాక, ఆ బిడ్డకోసం వ్యభిచరించాల్సిన పరిస్థితుల వొత్తిడి తీవ్రమైనా లొంగలేదు. తన బిడ్డ భవిష్యత్తుకూడా చివరిలో అప్రధానమైపోయింది. ఆదర్శమూర్తియైన పోలీస్ ఆఫీసరుకి ఇచ్చిన మాటకోసం, తన మాన సంరక్షణార్థం తనకుతానే పొడుచుకున్నది ఒక(నాటి)పతిత! వ్యక్తివికాసానికి జీవితపు విలువల పునరుజ్జీవనానికి, ఆత్మోన్నతికి క్రమపద్ధతిలో సాగిన సన్నివేశాల పట్టుతో ప్రదర్శనాయోగ్యతనేగాక, ప్రయోజకత్వాన్ని నిలుపుకున్న విశిష్టనాటిక 'స్త్రీ.'

వేశ్యపాత్రకు ప్రాణంపోసింది శ్రీమతి యం చంద్రసేన ఆదర్శ యువపోలీస్ ఆఫీసరుగా అద్యంతం చక్కగా నటించి విశేషప్రతిభను ప్రదర్శించారు శ్రీ రాళ్ళపల్లి రామసుబ్బారావు మిగతాపాత్రల్లో అక్కరాజు రఘురామయ్య, చిలుకోటి శ్రీనివాసరావు, దూబగుంట వెంకటేశ్వరరావు, పి పెంచ్ కె ప్రసాదరావు, సుందరరాజారావు పాత్రోచితమైన నటనతో ప్రేక్షకుల్ని ఆకట్టుకున్నారు. నటీనటులు పాత్రలలో ఎంతగానో సంలీనమయారు, ఇమిడిపోయారు. వారి ఆహార్యం, అహార్యం పాత్రోచితమై రాణించాయి.

సంభాషణలు ప్రేక్షకుల ఆదరణను పొందాయి. అనుచితమైన, అసహజమైన, అనవసరమైన డైలాగ్ ఒక్కటీ లేదు. సంభాషణలకనువైన, సరిగ్గా అతికిన పాత్రల "మూవ్‌మెంట్స్" సన్నివేశాల "ఫినిషింగ్" దర్శకుని పనితనాన్ని చాటాయి. నాటికలో ఎక్కువభాగం రంగస్థలంమీద ఇద్దరే పాత్రలు వుండేట్టుగా రచించి, ప్రదర్శనలో పట్టునుసాధించారు.

అంతర్జాతీయ బాలికా సంక్షేమసంవత్సర సందర్భంగా జిల్లా సాంస్కృతిక వ్యవహారాలమండలి ఏర్పాటుచేసిన నాటికల ప్రదర్శనలో ఈ "స్త్రీ" నాటిక చోటుచేసుకున్నది. టౌన్‌హాలులో 12 తేదీ ప్రదర్శింపబడిన ఈ ప్రదర్శనకు ముఖ్య అతిథి జిల్లా కలెక్టరు శ్రీ కె రాజు. ★

### కోవూరు సబ్‌జడ్జి కోర్టులో

E P 21/90 O S 76/86

Indian Bank, Nellore rep: by its Branch Manager -D Hr.

కాటూరు జయలక్ష్మమ్మ పురఫ్ జయమ్మ తరుణవాయి, సంగం మండలం -జె డి 3

డి హో నీ వగైరాలమీద ఇ పి పెట్టియున్నందున నీకు సేలనోటీసునిమిత్తం 8-8-91 తేది వాయిదా వేసియున్నది. వాయిదారోజు ఉదయం 10-30 గంటలకు నీవు పై కోర్టుకు హాజరై నీకుగల అక్షేపణను తెలుపుకోవలసినది. లేనియెడల ఎక్స్‌పార్టీగా తీర్మానించబడును.

-కలికి కోదండరామిరెడ్డి డిహోల్డర్ల వకీలు



18 తేదీ నెల్లూరుజిల్లా పర్యటనకు వచ్చిన ఎన్టీఆర్ ను సాదరంగా ఆహ్వానిస్తున్న జి ప్ర వ ధేర్మికా కేగా నారసింహారెడ్డి: నెల్లూరు టౌన్ లో జనసందోహం

## నెల్లూరుపోలీస్ (మొదటిపేజీ కొరవ)

ముఖ్యమైనదే తెలియాలి. దొంగతనం జరిగినదని సంతోషమో. లేక తనను ఇంకా నమ్మి, పోలీసాఫీసరుగా గుర్తించి, పోలీసువార్త చెప్పే అమాయకులున్నందుకు ఆనందమో అర్థంకాలేదు. చోరీజరిగిందని తెలిస్తే ఎక్కడజరిగింది, ఎప్పుడుజరిగింది ఎంతపోయింది అన్న కనీస సమాచారం కూడా తెలుసుకోవాలనే ఆసక్తి లేనివారిని ఇన్స్పెక్టర్లుగా నియమించడమంటే, పట్టణ పౌరులను దొంగలకు అప్పగించడం తప్ప ఏమౌతుంది? దొంగతనం జరిగిన ప్రదేశాన్ని పరిశీలించుకోవడం తర్వాత కూడా దర్యాప్తు చేయడానికి తీరికలేని, శ్రద్ధలేని సోమరి పోతుల చేతికి పౌరుల ధన మాన ప్రాణ రక్షణ బాధ్యతను అప్పగించడంకంటే. టౌను దొంగలకు బహిరంగ వేలంపెట్టి వంతులవారీగా, ప్రాంతాలవారీగా దోచుకోమని చెప్పడం మంచిదికదా!

ఈ వారంలోనే టౌనులో నాలుగైదు చోరీలు జరిగాయి. లక్ష్మీనగర్ అనాల్సింది పోయి ఆ మధ్య సరస్వతీ నగర్‌గా నామకరణం చేసుకున్న సంపన్నుల నివాస ప్రాంతంలో 18 తేది రాత్రి రాటూరు హరికిషోర్ రెడ్డి ఇంట్లో పెద్దదోపిడీ. గ్రిల్స్ తలుపు విరగొట్టుకొని లోపలకువచ్చి, ఇంట్లోనివారిని భయపెట్టి, నగలు నగదు ఎత్తుకపోయారు. 18 తేదే. మిట్టమధ్యాహ్న సమయంలో బెల్కెమిట్టలోని డాక్టర్ సత్య నాథ్, ఇంట్లో వుండగానే లోపలకుదూరి 60 వేలు దోపిడీచేశారు.

అంతకుముందు రామమూర్తినగర్‌లో ఒకటి, రామలింగాపురంలో ఒకటి చోరీలు జరిగాయి.

పగటి దొంగతనాలదే మరీఘోరం. వెనకు గిరవులేకుండా పట్టపగలే ఇళ్ళలో దూరి, దొరికినంతవరకు దోచుకపోవడం మామూలైపోయింది. తలుపులకు తాళం పెట్టి, పక్కింటికి పోయివచ్చే అవకాశం లేకుండా పోయింది. ఆమధ్య హౌసింగ్ బోర్డు కాలనీలో రెండు చోరీలు. ఒక ఇంట్లోదూరి దొరికినవి మూటకట్టుకొని; ఫ్రిజ్ లోని కూరలతో డైనింగ్ టేబుల్‌పై భోజనంచేసి; తీరిగ్గా, హాయిగా టెలివిజన్ ఆన్‌చేసి కుర్చీలో సుఖాసీనుడై వినోదిస్తుండినాడట. చుట్టుప్రక్కలవారు చూచి, గుంపుగా వచ్చేసరికి లోపల తలుపు గడియపెట్టుకున్నాడట. తలుపుపగులగొట్టి ఆ దొంగను పట్టుకున్నారట. న్యూ మిలిటరీ కాలనీలో ఒకటి; పొదలకూరురోడ్డులో రెండు; అంతకు ముందు జర్నలిస్టు కాలనీలో ఒకటి. న్యూ మిలటరీకాలనీ అనుకొని ఇరు ఇంట్లో, మధ్యాహ్నం 12-30 గంటలప్పుడు ఫాంటు స్లాకు ధరించి, నోట్లో సిగరెట్‌తో ఒక్క ఘరానాయువకుడు గేటుదాటి లోపల ప్రవేశించబోతుంటే, చూచిఅరిస్తే తడబడే మాటలతో చల్లగా జారుకున్నాడట. ఈ విధంగా ఎన్నో జరుగుతున్నాయి దొంగతనాల సంఖ్య పెరిగేకొద్దీ. పోలీసుకు రిపోర్టు చేసేవారిసంఖ్య తగ్గిపోతున్నది. ఎవరైనా రిపోర్టు చేయదలచినా, పోలీస్ కేసు రిజిష్టరు చేయడంలేదు. దుడ్డే కర్రతో కాపుకోండి!

పట్టపగలు చోరీలు జరగడంకంటే, పోలీసుశాఖకు పరువుతక్కువ విషయం ఇంకొకటుండదు. కానీ వారిలో ఏఒక్కరూ [illegible] లేదు. క్రింది స్థాయి అధికారులలో కొందరు అసమర్థులైతే, కొందరు అవినీతిపరులు చక్రవర్తులు. ఈ దొంగాగ్రేసరుల సవాల్ను స్వీకరించి పనిచేసే అధికారులేలేరు.

టౌనులో స్త్రీలు ఒంటిమీద బంగారు నగా నట్రా కూడా వుంచుకోలేక పోతున్నారు. అనుక్షణం భయంభయంతో బ్రతుకుతున్నారు. ముఖ్యమంత్రి స్వంతటౌనులో ఈదుస్థితి ఏర్పడటం విచారకరం. భూపతి బాబుగారూ! సింహపురి పౌరులను చోర భయంనుండి విముక్తిచేయండి. వారికి కంటినిండా నిద్రను ప్రసాదించండి! ★

## ఎన్టీఆర్
(9 వ పేజీ కొరవ)

లేదు. జనమూ పల్చబడ్డారు.

ప్రదర్శన తర్వాత గాంధీ విగ్రహ విష్కరణ పట్టణ ప్రథమపౌరుడు రామారావుగారికి పాదప్రణామం చేసి, తెల్లదొరలు తరలిపోయినా మనలో బానిస మనస్తత్వంమాత్రం చెరగిపోలేదని గాంధీ మహాత్మునికి సవినయంగా ఎరుకపరచారు. గాంధీబొమ్మను ఆవిష్కరించి, బెజవాడ గోపాలరెడ్డిగారిని, యాభై ఏళ్ళనాడు గాంధీ విగ్రహస్థాపనలో ప్రముఖపాత్రవహించిన వృద్ధ విలేఖరి శ్రీ పత్తి సుబ్బారావును శాలువతో సత్కరించారు ఎన్టీఆర్.

తర్వాత పత్రికావిలేఖరుల సమావేశం ఏర్పాటుచేసిన వేదికపైన వల. మైకులు పూర్తిగా విఫలమైనాయి. మాట్లాడవలసిన నేతలకే తప్ప, ఆ రణగొణధ్వనిలో ఎవరేమి మాట్లాడుతున్నారో విన్పించలేదు. వెనకనిలబడిన వారందరూ ఆ కరాలా "ప్రేక్షకులే" అయ్యారు. తారక రాములవారి తిట్లపురాణం సాంతపత్రికలోనే జరిగిపోయింది. పత్రికల్ని సింహస్వప్నమైన హాకర్లన్ని చూస్తూ, తీరు కుంటోందని అన్నగారు ఆవేదనపడిపోయారు (వంగవీటి రంగా అర్మకాండలు గాక!)

కన్వీనర్ పదవికి రాజీనామా విసిరిపారేసిన శ్రీ ఆనం రామనారాయణరెడ్డి తప్ప, తక్కిన జిల్లా తెలుగు నాయకులందరూ ఒక్కరు తప్పిపోకుండా అన్నగారి వెంట వుండినారు. రామనారాయణరెడ్డి మాత్రం గెస్టుహౌస్‌లో ఒక్క దండంపెట్టి, సెలవు తీసుకున్నాడు. ×

## రాజధానిలేఖ
(మొదటిపేజీ కొరవ)

రని విద్యాసాగరరావు విమర్శించారు. హనుమంతరావు ధోరణి చూస్తుంటే ముఖ్యమంత్రిని 'అర్ధాసనం' కోరే విధంగా వుందన్నారు.

తెలుగుదేశం పార్టీ నాయకులు కూడా హనుమంతరావు ధోరణిపై విమర్శలు గుప్పిస్తున్నారు. హనుమంతరావు ఏ విధంగా ప్రభుత్వ కార్యకలాపాల్లో జోక్యం చేసుకుంటున్నారో సాక్ష్యాధారాలను సేకరిస్తున్నట్లు తెలుస్తోంది. పి సి సి చీఫ్ వ్యవహార ధోరణిని రానున్న అసెంబ్లీ సమావేశాల్లో తూర్పారబట్టేందుకు రంగం సిద్ధం చేస్తున్నట్లు అభిజ్ఞవర్గాల కథనం. ★



# పెండ్లి పిలుపు

మిత్రులకు - నమస్కారములు

మా కుమారుడు చిరంజీవి శ్రీనివాస్ B E. వివాహం సర్వేపల్లి నియోజకవర్గం శాసన సభ్యుడు శ్రీ సి. వి. శేషా రెడ్డిగారి కుమార్తె సౌభాగ్యవతి శైలజ B A. తో 2-3-91 తేది ఉదయం 7-06 నుండి 8-42 గంటలమధ్య నెల్లూరు టి టి డి కళ్యాణమండపంలో జరుగుతుంది. అందరికీ ఆహ్వానాలు పంపాము. మాలోపంతోనో, లేక తపాలావారి లోపంతోనో మీకు అందనట్లయితే అన్యథా భావించక ఇదే మా స్వంతపిలుపుగా భావించి తప్పక వివాహానికివచ్చి దంపతులను ఆశీర్వదించమని ప్రార్థిస్తున్నాను.



వందనాలతో
మీ
ఊటుకూరు బ్రహ్మారెడ్డి.